సంపుటము 2]  అక్టోబరు 1915  [సంచిక 4

# బాలమిత్ర



## ఒక విశ్వాసముగల చిన్నబిడ్డ

ఒక పట్టణములో దంపతు లిద్దరుగలరు. వారికి యిద్దరు కుమార్తె లుండిరి. వారు చాల చిన్నవారు. వారి తల్లి దండ్రులు చాల బీదవారైనందున వారి కాహారము వారు

కుట కష్టతరమైనందున, వారితండ్రి ప్రతియుదయము కూలికి పోయి 4 అణాలు సంపాదించి తన కుటుంబమును బోషించుచుండెను. వారి కుమార్తెలు 5, 4 సం॥ లు గల బాలికలై యున్నందున, వా రేపని చేయుటకు శక్తిగలవారు కాకపోయిరి. అయితే పాపము ఒకనాటి యుదయమున వారితండ్రి, పెందలాడి 4 గంటలకు తన పనికి బోవుచుండగా మార్గములో పాము కరచినందున మృతిజెందెను. ఈ వార్త తన భార్యబిడ్డలకు చెవినిబడగానే వారియొక్క సంతోషమంతయు దుఃఖసాగరమునందు సంగమించినట్లుండెను. అప్పుడు తల్లి వారిని యోదార్చుచు వారిని యేపనికి బోనివ్వక తానే కష్టపడి 10 సం॥ లవరకు బోషించుచు వచ్చెను. ఇంతకష్టపడి బోషించుచున్నప్పటికి తాను తన కష్టమును యేమాత్రము తలంచక, వారికి విద్యాభ్యాసము నభ్యసింపవలయునని కోరి ఒక క్రైస్తవ ధర్మ పాఠశాలకు బంపెను. వారు ప్రతిదినము తమ పాఠములను చక్కగా చదువుకొని పోవుచుండిరి. అందువలన ఉపాధ్యాయుడు వారియెడల అమితానురాగము గలవాడై వారికి మరీ శ్రద్ధగా విద్యను నేర్పుచుండెను. ఆ క్రైస్తవబడిలో ప్రతి ఆదివారము సబ్బాతుబడి జరుగును. ఆ సబ్బాతుబడికి ఈ బిడ్డలుకూడ బోవుచు క్రైస్తవ కథలను నేర్చుకొనుచు ప్రతిదినము క్రీస్తుబోధలను, ఆయనజేసిన

ఘన కార్యములనుగూర్చి నేర్చుకొనుచుండిరి. తాము నేర్చుకొనిన బైబిలు బోధలను తల్లికికూడ చెప్పుచువచ్చిరి. వారా బడికి వెళ్లినదిమొదలు వారు చాల మంచివారై ప్రతిదినము దేవునిని ప్రార్థించుచుండురు. ఎందుకనగా వారు బడిలో, విశ్వాసముతోను పట్టుదలతోను చేసిన ప్రార్థనను దేవుడు ఆలకించునని నేర్చుకొని యున్నందున వారాలాగు దేవుని యందు విశ్వాసముంచిరి. ఇట్లుండగా వారితల్లికి ఒకనాడు అకస్మాత్తుగా జ్వరమువచ్చి పనికి పోజాలక పోయెను. గనుక పాపము వారికి ఆ రోజున ఆహారము లేకపోయెను. పిల్లలు బడినుండి యింటికి వచ్చులోపల తల్లి చాల బాధపడుచుండెను. బిడ్డలు తల్లినిచూచి యేడ్చుచు కొంచెముసేపు తమతల్లికి సహాయముచేసి బడిసమయము కాగానే భోజనము చేయకనే బడికివెళ్లిరి. తల్లి తన పిల్లలనుచూచి చాల దుఃఖించుచుండెను. ఎందుకనగా వారు మధ్యాహ్నము భోజనము చేయక పోవుటచేత వారి ముఖములు చిక్కి బలహీనముగా నున్నట్లు చూచెను. అందుకై వారితల్లి సాయంత్రమునకైన భోజనము సంపాదించ వలయునని చాల ప్రయత్నించుచున్నప్పటికిని ఆమె జ్వరములో యున్నందున పనికి పోజాలక దేవుని యెడతెగక ప్రార్థించుచుండెను. ఇంతలో నిద్దరు బిడ్డలువచ్చి అమ్మా, అమ్మా తలుపు దీయుమని కేకలు వేయగా

తల్లి తలుపుదీసెను. అప్పుడు వారందరు ఒక్కచోటకూడ మోకారించి దేవునిని ప్రార్థించిరి మరియు వారిట్లు ప్రార్థించుచుండగా వారికొక సంగతి జ్ఞప్తికివచ్చెను. అది యేమనగా పూర్వకాలమున ఏలియా అనే ప్రవక్తను దేవుడు కాకులతో నేలాగు పోషించి కాపాడెనో, అలాగున మనము కూడ దేవునిని పట్టుదలతోను విశ్వాసముతోను ఏలియా ప్రవక్తవలె ప్రార్థించినయెడల, మనకుకూడ సహాయము చేయగలడు అని వారు తమ తల్లికి చెప్పుచు వారిద్దరు నిద్రించిరి. అయితే వారితల్లి దీపము నార్పక కూర్చుండి దైవధ్యానము చేయుచుండగా, ఆ పట్టణమును కావలి కాయువారు సరిగా కాయుచున్నారో లేదో చూచుటకు, ఆ పట్టణపు అధికారి వారిని చూచుటకు ప్రతి బజారున దిరుగుచు, యీ బీద వారి బజారుకు వచ్చెను. ఎవరియిండ్లు చూచినను మూయబడి యుండెను, కాని యీ బీదస్త్రీ యింటి తలుపు మూయలేదు. ఆ యింటి తలుపెందుకు మూయలేదని కనుగొనుటకు అక్కడికి వెళ్లిచూడగా, ఆ యింటిస్త్రీ దీపమును ముట్టించి, బైబిలు చదువుచు దైవధ్యానము చేయుటచూచెను. అప్పుడు ఆ యధికారి యెందుకు మీ యింటికి తలుపు మూయలేదు? దొంగలువచ్చి మిమ్మునుగొట్టి మీ సొమ్మును దోచుకొనిపోరా? అని యడిగెను. అందుకు ఆమె యీరోజు మాకు భోజనము

లేదు. మరియు నా కుమార్తెలు దేవునిని ప్రార్థించి, అమ్మా దేవుడు మనకు ఆహారము పంపించును అని చెప్పి నిద్రించిరి. అందుక నేను నిద్రించక భోజనముకొరకై యెదురుచూచు చున్నాను అని చెప్పెను. ఆ దయగల అధికారి ఆశ్చర్యపడి, త్వరగా తనయింటికి పరుగెత్తుకొనిపోయి గంపనిండుగ పండ్లును, రొట్టెలు, ధాన్యమును, తన నవుకరిచేత పంపించెను. వారు తృప్తికరముగా తిని అప్పటినుండి నిజముగా దేవుడు తప్పక విశ్వాస ప్రార్థనను ఆలకించి, సహాయము చేయునని నమ్మి దేవునిని మరి, మరి, సేవించుచుండిరి.

> "ప్రభువైన యేసునందు విశ్వాసముంచుము,
> అప్పుడు నీవును నీయింటివారును రక్షణపొందుదురు."

---

## తాఁబేలు

తాఁబేళ్లు మంచినీళ్లలోను, ఉప్పునీళ్లలోను, మెట్టను, కూడ కనఁబడుచుండును.

జంతువులకు అవయవములు వానివాని ఆహారములకును అలవాటులకును తగినటుల ఉండును. అదేవిధముగ మెట్ట తాఁబేళ్లకును నీటి తాఁబేళ్లకును అలవాటులును ఆహారమును భేదించియుండును. కనుక ఆ రెండురకముల తాఁబేళ్లకును అవయవములుకూడ భేదించియుండును.

అయితే రెండువిధములయిన వానికిని తాఁబేళ్లనియే పేరు పెట్టినారు. రెండువిధములైన వానికిని కొన్ని పోలికలు సరి



పడి ఉండుటచేత ఈప్రకారము ఒక్కపేరే పెట్టినారు. వీనిలో భేదములు తెలియుటకుగాను మెట్టతాఁబేళ్లు నీటి తాఁబేళ్లు అని వేఱుపేరులతోఁ బిలుచుచుందురు.

తాఁబేలు సాధువైనజంతువు. ఇతరులకు హానిచేయదు. విరోధులనుండి తప్పించుకొనుటకు నోటిలో పండ్లైనను లేవు.

అందుచేత దానికి ఇతరజంతువులనుండి అపాయము కలుగ కుండ దాని వీఁపుమీఁద గట్టిచిప్పను దేవుఁడు ఇచ్చినాఁడు.

తాఁబేలు తన తలయు కాళ్లును ఆ చిప్పలోనికి ముడుచు కొనును. అప్పుడు దానిని ఏజంతువును కరువజాలదు. భయము తీరినతరువాత నురల బైటికి దీసికొనును.

నీటితాఁబేళ్ల కాళ్లకు వ్రేళ్లమధ్య బాతునకువలె చర్మ ముండును. అందుచేత అవి సులభముగా ఈఁదఁగలవు.

తాఁబేళ్లు చిన్నచిన్న పురుగులను, నాచు, పాచి మొద లగు వానిని తిని బ్రదుకును.

తాఁబేళ్లు కప్పలవలె గ్రుడ్లు పెట్టును. అవి సూర్యరశ్మికి పిల్లలగును.

తాఁబేలు దేవునియొక్క అవతారమని హిందువులు పూజచేతురు. ఈ భూమిని ఒక పెద్దతాఁబేలు తనవీఁపున మోయుచున్నదని హిందువుల నమ్మకము.

---

## బాలికలకొఱకొక చిన్న సామ్యము

“రాజలక్ష్మి నాకమిత కోపమును పుట్టించినది.”

“సరే, దాని విషయము చాలాకాలము తలంచలేదు గదా!”

" నేను విశేషముగాఁ దలంచితిని. ఆ కారణమున నా పాఠములను సహా నేను నేర్చుకొనలేదు."

" మంచిది, బాలికా! సాగసైన పండును చూచి తినుటకు దానికొని తినుచుండగా దానిలో నొక పురుగును జూచినయెడల నీ వేమి చేయుదువు?"

" వెంటనే నమలినదాని సహా యుమ్మివేసి దాని పారవేయుదును."

" అలాగైతే, క్రొత్త స్నేహితురాలిని సంపాదించుకొని ఆ స్నేహితురాలియందు స్వలాభమును పాటించుకొనెడు గుణమను చిన్న పురుగును కనుగొనిన దినమంతయు నామె దుర్గుణము విషయమే తలంచెదవా?"

" కాని, రాజలక్ష్మి పురుగు యుండినటువంటి పండును పోలినదికాదు; ఆమె యొకప్రక్కను (అనగా నొక విధముగా లేక యొక విషయములో) మాత్రమే మంచిది."

" నీవు చెప్పినది సత్యము; యామె యే విషయములో సద్గుణముగలదో దాని విషయమే యెక్కువగాఁ దలంచుము. అప్పుడు నీ కోపము చల్లారును."



# నక్షత్రములు



నక్షత్రములనగా తెలియునా? మన భూమివంటి ఇతర లోకములే. అవి మన కెంతో దూరమందుండుటవలన మన కంత చిన్నవిగాను, మిణుకు మిణుకు మనుమను గానవచ్చుచున్నవి. వాటిలో ననేకములు మన భూమికంటె ఎంతో పెద్దవి. కొన్ని సూర్యునికి చాల దగ్గరగా నున్నందున అతి కాకగా నుండును. మరికొన్ని మిక్కిలి దూరమందున్నందున, చాల చల్లగా నుండును. అక్కడకు మనము వెళ్లిన యెడల చలికి కట్టెలవలె బిగిసికొనిపోదుము. ఇక్కడగాక మరెక్కడను జీవించుటకు వీలుగానట్లు దేవుడు మన దేహ

ములను చేసియున్నాడు. ఇక్కడ మనకు తగులునట్టి ఎండను చలిని సహించుటకు తగినశక్తి ననుగ్రహించి యున్నాడు. మనకంటె ఎక్కువ ఎండనుగాని చలినిగాని సహించునట్టి బాలబాలిక లింకేలోకమందైన గలరేమో మనకు తెలియదు. ఆకాశమందున్న ఆ లోకముల కన్నిటికి తగిన పనులను దేవుడు పెట్టియున్నాడు. ఇవన్నియు లోకారంభము నుండియు, వెలుగుచు భూమికి కాంతి నిచ్చుచున్నవి. మనము పరలోకమునకు వెళ్లినప్పుడు అక్కడ మనము వీటినిగూర్చి చాలసంగతులు నేర్చుకొనవచ్చును.

---

# ప్రకృతి పాఠములు

## 15-వ పాఠము

## ప్రకాండము

విత్తనమును భూమిలో నాటినపిదప ఒకటి రెండు దినములలో, దానిలోనుండి ఒకటి బయలుదేరి భూమిలోనికిని, మరియొకటి భూమిపైకిని వచ్చుట కనుగొనుచున్నాము. భూమిలోపలికి వెళ్లినదానికి వేరు అని పేరు. భూమి పైభాగమునకు వెలుతురును వెదకుచు వచ్చినదానికి ప్రకాండమని పేరు. చెట్టు చిన్నదిగానుండి మొలకరూపమున నున్న



ప్పుడు ప్రకాండము రెమ్మగా నుండును. గాని, చెట్టు పెద్దదైన పిదప ప్రకాండము బలిసి లావై, అనేక కొమ్మలను గలిగి నానా దిక్కులకు వ్యాపించును. ప్రకాండముల నన్నిటిని మూడు ముఖ్య తరగతులుగా చేయవచ్చును.

చిక్కుడు, గుమ్మడి, బీర మొదలగు కూరగాయ మొక్కల యొక్కయు, దొండ బుడ్డ బూసర మొదలగు కంపలలో నెదుగు మొక్కల ప్రకాండములు తీగలవలె ప్రాకిపోవును. ఇవి చాలదూరమువరకు పోయి స్థలము నెక్కువగా నాక్ర

మించుకొనును. వీనికి ఆనుకొనుటకును ప్రాకుటకును ఆధారము లుండవలెను. గాని, ఈ జాతిమొక్కలు కొన్ని మాసములవరకు మాత్రమే బ్రతికి ఫలించి చచ్చిపోవును.

వేప, చింత, మామిడి, మొదలగు వృక్షముల ప్రకాండములు తిన్నగా పెరిగి కొన్ని సంవత్సరములలో చాల ఎత్తుగాను లావుగాను వృద్ధియై, అనేక కొమ్మలనువేసి, విస్తారముగా ఆకులను గలిగియుండును. ప్రకాండమంతటిలో, బోదె ఎక్కువ లావుగానుండును. కొన్ని చెట్లబోదెల చుట్టుకొలత దాదాపు నూరడుగు లుండును. కాలిఫోర్నియాలోని ఒక చెట్టుబోదె తొలిచి, దానిగుండా బండ్లు నడచుటకు దోవ వేసి యున్నారు. పైనచెప్పిన రెండురకముల ప్రకాండములు వెలుతురును వెదకుచు భూమిపై పెరిగి పెద్దవగుచున్నవి.

ఇవిగాక భూమిలోపలనే ప్రకాండములు గలిగి ఆకులను మాత్రమే భూమిపైనగల మొక్కలును గలవు. చేమ, కంద పసుపు, అల్లము, ఉర్లగడ్డ, మొదలగువాని ప్రకాండములు భూమిలోపలనే పెరిగి వ్యాపించి వృద్ధి నొందుచున్నవి. ఇట్టి ప్రకాండములకు గడ్డలనిగాని దుంపలనిగాని పేరు.

ప్రకాండముయొక్క ముఖ్య ఉపయోగము. చెట్టుయొక్క ఆకులు, మొగ్గలు, పిందెలు, పువ్వులు, కాయలు, పండ్లు మొదలగువానిని మోయుటయు, వృక్షమునకు సూర్యుని

వెలుపరు వేడిమి తగినట్లుగా తగులునట్లు చేయుటయునై యున్నవి. ఎక్కువ ఆకులు కాయలు మొదలగువానిని మోయు చెట్లప్రకాండములు పెద్దవిగాను, కొద్ది ఆకులు గలిగి కొద్ది కాలముండు చెట్లప్రకాండములు చిన్నవిగాను సన్నగాను ఉన్నవి.

---

# బైబిలు పిల్లలు

## షిమ్యోను, లేవి

లేయాకు రూబేను పుట్టినతర్వాత షిమ్యోను ఆ తర్వాత లేవి అను ఇద్దరు బాలురు పుట్టిరి. వీ రిరువురు ఇరుగు పొరుగున వాసము చేసెడి తుంటరిబాలుర చెలిమిచేసి చిన్నప్పటినుండి చెడుబాలురుగానే పెరిగిరి. వంగిన లేత అంకురమును నిట్రముగానుంచ నశ్రద్ధ చేసినయెడల కొంచెము పెద్దదైన వెనుక దాని వంక తీయజాలముగదా? అది వంగియే యుండి పెద్దమ్రాను అయి చూచువారలకు అసహ్యముగా కనుబడునుగదా? అదేరీతిని ఈ ఇరువురు బాలురను వయస్సునందు వృద్ధి జెందుచున్నను సుగుణములందు వృద్ధి ఎంతమాత్రము చెందకుండా యుండిరి. బాలమిత్రులారా! మనలో నెవరైన ఈ ఇద్దరుబాలురవలె వయస్సునందు మాత్రము

వృద్ధిజెందుచు, దుష్టులుగానే యుంటున్నారా? ఉన్నట్లయిన చాలా దుఃఖకరమైన సంగతియే. కాన మీరు మీ చిరుత ప్రాయముననే మీ వంకర గుణముల మాని మంచివారు అగునట్లు ప్రయత్నపడుడు. లేదేని మీరు పెద్దవారైనప్పుడు ఎంత మాత్రము మంచివారుగా నుండలేరు.

వీరు ఇద్దరు నరహంతకులైరి. షెకెములోని ప్రతిపురుషుని మోసముగా, కత్తివాతచే కూల్చిరి. చూచితిరా! ఒక దుష్ట కార్యము మరియొక గొప్ప దుష్టకార్యమునకు క్రమేణ నడిపించును. నేడు అవిధేయత చూపు బాలుడు రేపు అబద్ధములాడును. మరునాడు దొంగతనము చేయ సాహసించును. మరియొకనాడు నరహత్య చేయును. ఇట్లు చెడ్డతనమునందే వృద్ధి జెందుచుండును. కావున మనము మొదటనుండియే ఏవిధ చెడు క్రియ చేయకుండునట్లు తగు జాగ్రత్త మన విషయమై పుచ్చుకొనుచుండవలెను. వీరిద్దరును తమ తమ్మునియందు అసూయగలిగి వానికి కీడు కలుగజేసిరి. సహోదరులు ఒకరితో నొకరు పోట్లాడక, సమాధానముగాను అధిక ప్రేమగలిగి ఒకరికొకరు ఎంతయు సాయము జేసికొనుచు నుండవలెను. మనము ఇతరులకు కీడుచేసితిమేని మనకు మనమే కీడు రప్పించుకొనువారమగుదుము. వీరికి చాలా కష్టము ప్రాప్తించెను.

వీరి తండ్రియైన యాకోబు తన అవసానకాలము కుమా

రుల నందర దీవించునపుడు వీరిని గురించి చెప్పినమాటలు చాలా విచారకరమైనవి. ఆదికాండము 49: 5–7 వరకు చదువుడి. ప్రియ చదువరులారా! దైవము మనల నిట్టి పాపకరమైనదియు శాపకరమైనదియునైన బ్రతుకునుండి దూరపరచును గాక!

# బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రులారా!



నా తండ్రి సి. యం. యస్. మిషనులో 16 సం॥ల నుండి పనిచేయుచున్నాడు. ఆయనకు ఐదుగురు కుమారులును, ఇద్దరు కుమార్తెలు

గలరు. కుమారులలో నేనే కనిష్ఠుడను. ఇప్పుడు నేను సి. బి. యస్. బోర్డింగ్ నందుండి ట్రెయినింగ్ స్కూలులో 2-వ ఫారము చదువుచున్నాను. మా బోర్డింగ్ లో 20 మంది పిల్లలున్నారు. వీరిలో 26 గురు కాలేజిలో చదువుచున్నారు. ట్రెయినింగ్ వారిలో కొందరు ప్రతిశుక్రవారమును కొంతమంది వీధిప్రసంగమునకు వెళ్లుదురు. మా బోర్డింగ్ లో ప్రతిదినము సాయంత్రము 7 గం॥ లప్పుడు ప్రార్థన చేసికొందుము. ప్రతిశుక్రవారము సాయంకాలము ప్రార్థనమీటింగు చేయుదురు. ఈ మీటింగ్ లో ట్రెయినింగ్ వారిలో నిద్దరు సెక్రెటరీగాను అసిస్టెంటు సెక్రెటరీగాను ప్రసంగించిన వారే ప్రార్థన చేసినతరువాత అందరును నిలచి సంగీతముపాడి ప్రభుప్రార్థనతో ముగించడమగును. ప్రియ బాలమిత్రులారా! విద్యార్థులైన వారందరును తమతమ తరగతులచొప్పున మార్చి, ఏప్రల్ నెలలలో పరీక్షింపబడనై యున్నారు. కాబట్టి వారి పరీక్షలలో దేవుడు వారికి తోడై యుండులాగునను, ఇప్పుడు ఈ భూమండలముమీద యుద్ధము చేయుచున్నవారి చేతులలో పడకుండ యుండులాగున దేవుడు తన కృపను అనుగ్రహించునట్లు మనమందరమును ప్రార్థించుదుము గాక!

ఇట్లు

మీ ప్రియబాలమిత్రుడు

తలారి ఆనందయ్య

బందరు

C. L. S. PRESS, MADRAS—1915